శ్రీ

నిర్గుణపరబ్రహ్మణేనమః.

# పంచబంధవిముక్తి.

ఇది

వరదా సూర్యనారాయణ

ప్రకటితము.

మొదటికూర్పు 1000 ప్రతులు.



రామమోహన ముద్రాక్షరశాల, ఏలూరు.

1915.

శుభమస్తు.

శ్రీనిర్గుణపరబ్రహ్మణేనమః.

# పంచబంధవిముక్తి

యను

అచలగ్రంథము.

ఇది

శ్రీమద్వరదావంశ పయఃపారావార రాకాసుధాకరులును పండితాగ్రేసరులునగు తమ్మయాభిధేయుల పౌత్రుండును, సకల సద్గుణ శ్రేష్ఠులైన అచ్చయాఖ్యుల పుత్రుండును, మాతృ పితృభక్తిపరాయణులగు తమ్మయార్యుల కనుజుండును షడామ్నాయదీక్షానిష్ణాతులును వేదవేదాంగ విద్యానైపుణ్యులును బ్రహ్మవిద్యానిష్ఠాగరిష్ఠులును నగు శ్రీమత్పట్నాల రామయోగివర్యుల దౌహిత్రుండునునైన

సూర్యనారాయణచే

రామమోహన ముద్రాక్షరశాలయందు ముద్రింపించి

ప్రచురింపబడియె.

ఓమ్

# శ్రీసద్గురుపరబ్రహ్మణేనమః.



"సద్రూపత్వంనాస్తిసర్వత్ర చిద్రూపత్వంనాస్తిసర్వదా। ఆనందరూపకంనాస్తి అచలంచాస్తిసర్వదా। సర్వానందవిహీనంచ అచలోయంసనాతనం। ఆనందరహితమచలం కర్తృకార్యవివర్జితం। జ్ఞానమానందకంబ్రహ్మ యిత్యుక్తంమూఢమానవైః। జ్ఞానాత్సంజాయతేనందో ఆనందోభ్రాంతిలక్షణః। సత్యజ్ఞానమనంతంచ మాయాగుణమిదంశృణు। నిర్గుణంనిశ్చలంపూర్ణం సర్వకాలేషు సంస్థితం। జాగ్రత్స్వప్నసుషుప్త్యాది అవస్థాపంచకంసహి। సర్వకాలేసదావ్యాప్తం సర్వదేశేషువ్యాపృతం। నిష్కామం నిర్మలంశుద్ధం అచలంశబ్దవర్జితం। తేజోంధకారరాహిత్యం గోప్య బ్రహ్మనసంశయః। సచ్చిదానందరూపత్వం మాయా ఇత్యభిధీయతే" అనిపలుకుచున్న ఉపనిషత్ప్రమాణానుకూలంబుగా సంపూర్ణత్వమునొందియచలగురుస్వాములయిన శ్రీరామమడుగు శివరామ దీక్షితులువారిశిష్యపరంపరలో గణనాతీతులయిన శ్రీనారాయణ గురుస్వాములవారికి ప్రియశిష్యులును పింజరపువంశకలశార్ణవ శరద్రాకాసుధాకరులును జ్ఞాననిష్ఠాగరిష్ఠులును, అద్వైతసిద్ధాంతదేశకులును, అచలపరిపూర్ణనిశ్చయ సంపత్ప్రకాశమానులునై కొందరిశిష్యులచే శంకరానందులనే పర్యాయనామంబుచే నొప్పుచున్న శ్రీశంకరాచార్య స్వాములవారి శిష్యసమూహములో నొకండనైన నేను

(అశరీరం సర్వదా అస్తి అశరీరం రహితం సదా అయమేవ సదా
ముక్తిః। అన్యదా భ్రమ కారణం, అను న్యాయమును పొందియున్న
అచలభావజ్ఞునిచే రచింపబడిన పంచబంధ విముక్తియను గద్యప
ద్యాత్మకంబగు నొక్క చిన్న ప్రాచీన గ్రంథము రచించుటచే దీని
నచ్చొత్తించినచో। శ్రీగురుపాదారవింద సంసేవ ధురంధరులకే
గాక యెల్లమానవులకు రాగద్వేషాదులడంచి మోక్షాయత్తులం జేయు
నని యోచించుచుండగా (భర్తౄణామేవ శుశ్రూష స్త్రీణాం ధర్మ
స్సనాతనః। నార్యోవిష్ణుపదం యాంతి పతిశుశ్రూషయైవహి॥ పతివ్ర
తాం స్త్రియం స్పృష్ట్వా ప్రణమష్యమరా అపి। అని కాత్యాయన ఋషి
వచనప్రకారం। స్త్రీలకు తమ భర్తయొక్క సేవయే ముఖ్యమైన ధ
ర్మము. అట్టి ధర్మము నాచరించిన స్త్రీలు పతిశుశ్రూష మాత్రమున నే
సాయుజ్యపదవిని బొందుచున్నారు. అట్టి మహాపతివ్రతలకు దేవ
తలయిన నమస్కరింతురు. అట్టి స్త్రీరత్నములలో శ్రేష్టమై శాం
తశమదమాద్యనేక కళ్యాణ గుణగణాలంకారిణియు, మనోవా
క్కాయములనే త్రికరణసాక్షిగ భర్తకు చతుర్విధ శుశ్రూషలం
జేయుచు క్షీరోదకన్యాయంబున వర్తిల్లుచుండ నమ్మహా పురుషుం
డిహలోక సౌఖ్యంబులం బాసి పరలోకవాసుండైనను పతిపాద
ధ్యానపరాయణురాలై అతిథి అభ్యాగత సత్కారంబుల నెరవు
(సత్యవాక్యోదృఢవ్రతః) అనే న్యాయవాక్య నిరూఢిం జెందుచు
శ్రీమన్నారాయణ శబ్దాతీతమయిన అచలగురు పాదారవిందమరం
దపానతుందిల మదపదిందిరాయమాన మానసురాలునై నవరత్నము
లలో శ్రేష్టతరమై తేజోవంతమై కొనియాడబడుచున్న మణివలె
స్త్రీజనంబులలో మణినామంబున విరాజిల్లుచున్న కొత్తమాణి

క్యాంబయనే గురుపుత్రికారత్నము ప్రోత్సాహ ప్రయత్నవా కుక్రియేగాక సంపూర్ణద్రవ్యసహాయమునుగూడ చేయుటచే వ్రాసిన గ్రంథమును యతిగణప్రాసలక్షణము నెరుగకుండినను మద్గురు కరుణా కటాక్ష వీక్షణములవల్ల నాచే వ్రాయబడిన కొన్నితత్వ కీర్తనలు యిందుబొందుపరచి ముద్రింపించితిని యిట్టిమహోత్కృష్టమైన గ్రంథములో యీతత్వము లేలనుంచితివన వరునవేదిసాన్నిధ్యమందున నినుముబంగార మగునట్లు నాతత్వములకు పరిశుద్ధత్వముగల్గునని యెంచినాడను. ఆర్యులారా యీగ్రంథమందు లేఖనప్రమాద జనితదోషములుండిన క్షమింప గోరుచున్నాడను. మాగురుశిష్య గణనాతీతులయిన బ్రహ్మశ్రీ వేములపండిత వీరేశ లింగశాస్త్రిగారిచే సర్వగ్రంథమును నిర్దుష్టముగా పరిష్కరింపబడినది.

ఇట్లు విన్నవించువిధేయుఁడు,

వరదా సూర్యనారాయణ.

ఓం

శ్రీనిర్గుణ పరబ్రహ్మణేనమః

# పంచబంధవిముక్తి.



వ. శ్రీమానుమద్గిరినివాసుండగు శివరామయోగీంద్రులవారు శ్రీభైరవాచలనివాసుండైన శేషమానీంద్రులవారిని ప్రార్థించగా దయగలవారై సాంఖ్యతారకములు బోధించి తుదకు యమనస్కంబైన పరిపూర్ణంబుబోధించుటకై తెలియపరచిన గద్యపద్యాత్మకంబగు పంచబంధవిముక్తియను గ్రంథమునకు కథాక్రమం బెట్లనిన.

కం. వినుశిష్య పంచబంధము
లనియెడిభ్రమముళ్ళ వివరమాద్యంతముగా
వినజేసి యెరుకకవ్వల
నినుజేర్చెద గురునియాన నిక్కముగాగ

వ. అది యెట్లన్నను మాయాపంచబంధములలో నొకటి పూర్వజన్మంబనియు రెండవది మాతాపితృలనియు మూడవది యోనిసంభవమనియు, నాల్గవది పంచభూత యుక్తంబనియు, అయిదవది పునర్జన్మంబనియు నొప్పెడి యీమాయయెరుకచే కల్పితంబైన యీపంచబంధములచే కట్టుబడి ప్రపంచంబున కతి

తుండైన అచలగురునెఱుంగక జననమరణంబులను మహాప్రవాహంబు దాటుటకశక్యంబై మునుంగుచు దేలుచుందురు గావున యీపంచబంధవిముక్తునిగా జేసి నీకు పరిపూర్ణంబైన అఖండ తేజంబెఱింగించెద సావధానంబుగా నాకర్ణింపుమని వరమగురుండైన శేషనరేంద్రుడు శివరామయోగికిట్లనియె.

## పూర్వజన్మబంధము.

క. మున్నొక జన్మంబని మా
యన్నాశ్రమపడుట ధర్మమగునా యిదినీ
కెన్నంగలేదు సర్వము
సున్నసుమీ నిజమెఱింగి చూచిన పిదపన్

అదియెట్లన్నను-

గీ. మాయలేకమున్దు మరియేమిలేదాయె
మాయ చేసమస్త మాయగాన
మాయనరులబోధ మాయయేగాకను
మాయవలదు బ్రహ్మమార్గమగునె.

చ. మాయ జగంబులన్నియును మాయ నరుల్ వసుధాదిభూతముల్
మాయ నినుండు చందురుడు మాయ మహాదశమండలంబులున్
మాయ గ్రహాదితారలును మాయహిమాచలముచ్చిడుగణముల్
మాయభవానిశంకరులు మాయగదా విధివిష్ణులాదిగన్.

సీ. వేదాగమములెల్ల వెదకిచూచిన మాయ
శాస్త్రపురాణముల్ చదువు మాయ

సప్తాంబుధులుమాయ సర్వేశ్వరుడుమాయ
మతములన్నియుమాయ మనసుమాయ
బ్రహ్మాండమునుమాయ ప్రణవాక్షరముమాయ
క్షరమక్షరము చరాచరముమాయ
కులగోత్రములుమాయ కొప్పకొద్దులుమాయ
తలిదండ్రులన్న దమ్ములునుమాయ

గీ. స్నానసంధ్యాదిమంత్రముల్ జపతపంబు
లష్టవిధమైన యోగంబు లాదిగాగ
నెంచిచూచిన మాయకుమించియున్న
దొకటియులేదు జగములో నిక్కముగను.

ఆ. గానమాయలోన గలవారమునుజన్మ
మున్నదనుచు నీకు ముందుగాను
చెప్పుచుంచిబుద్ధి జెరచిరంతేకాని
పూర్వజన్మమిల్ల పుణ్యపురుష.

క. వారలుతమకా జన్మంబారూఢిగ
గలదటంచుయన్పతంబులు
నింపారగబలికెరిగానీ
కూరిమితోజూపలేరు గురుపుత్రనిధీ.

వ. కావున పూర్వజన్మంబు వాచ్యార్థణంబు భ్రమణరూపంబేగాక సత్యంబుగాదనిన శేషమానీంద్రునకు శివరామయోగి యిట్లనియె

క. గురువరమునుపేక్షను
యేతెరఁగున యీజన్మమయ్యెధీబుధనుతయిం
వరయఁగ వినుపింపఁగదె
చిరతరముగ భక్తిగల్గి సేవింతుతగన్.

వ. అనిన శివరామయోగికి శేషమానీంద్రుండిట్లనియె.

గీ. అరయనవ్వహ్నాద్యవస్తుఃఖం దద్భుతముగ
దోఁచుదేహంబులెన్నెన్నొ దొడరిగాన
వచ్చినంతటమరియునే వంకకేగు
నయ్యదియె మాలమీమాలమదియెసమము.

వ. ఇదియె పంచదశాక్షరీయర్థము కావున పూర్వజన్మం బను భ్రమణంబు పంచదశాక్షరీయను మహామంత్రాగ్ని కాహుతి యొసంగితింగాన మరల నిన్నంటనేరదని పెండియు నిట్లనియె.

## మాతాపితృబంధం బెరింగించెద.

క. జననీజనకుల భ్రమనీ
మనమున కత్యద్భుతముగ మరిదోఁచుటనం
దనమాయ వేరెయున్నది
యనియోచింపంగనేల నదియును గాదే.

వ. కావున మాతాపితృలనెడి వాక్యం బసత్యంబు గాని సత్యంబుగాదనిన శేషమాని శివరామయోగికి నిట్లనియె. ఇందుకొక దృష్టాంతము జెప్పెద వినుముని యిట్లనియె.

క. వీరలె తలిదండ్రులనని
కోరిజనించితివా వారుగుర్తెరిగినినుం
గారవమున గనినారో
యీరీతిని దెలియుమాయ దృష్టాంతమిదే.

వ. కావున మజ్జననీజనకులని నీవెరింగి వచ్చినది గాదు. మత్పుత్రుండని జననీజనకు లెఱింగి తెచ్చుకున్నది గాదు ఇందుకు దృష్టాంతంబుజెప్పెద అట్లెరిగియున్నయెడల.

చ. కలిమికులంబుగోత్రమును గౌరవము౯ యతిశీలమాదిగా
గలుగుసమస్తసద్గుణని కాయముగల్గిన వారిబిడ్డలై
గలుగక హీనమానవుల గర్భజులైపడి పంచలందు
వెంగలులుగనుండవెర్రులయి కల్గుదురే మనుజ్ఞానముండిన౯.

వ. అదియునుంగాక అట్లాజననీజనకులు ఎరింగియున్నయెడల.

గీ. రూపురేఖవిలాసంబు రూఢిమెరయ
తెలివిగలబిడ్డలనువారు దెచ్చుకొనక
మూఢులత్యంతమూగ సమున్నతులగు
సుతులగాంతురె దెలసిన సూరిజనులు.

వ. కావున సమూలంబైన విశ్వరూపిణియగు మాయచే కల్పితంబైన బంధరూపంబెగాని సత్యంబుగాదనిన శేషనానీం దునవు శివరామయోగి యిట్లనియె.

మ. తలిదండ్రుల్ భువిలేకపుట్టుటయు తథ్యంబైన యీబైబిలులో
వలయీదేహము పుట్టరాదె యిదినింపారం స్వకాధీనమై
వెలయన్ గారణమేమి దెల్పుమది వేదంబుం బట్టగా మాని
రాటుంగలజా నన్నలయించు మాయ నెరుకన్ గావింపవే
సత్కృపన్.

వ. అని యధిగించిన శివరామ యోగికి శేష మానీంద్రుం
డిట్లనియె

గీ. మాయగాననిదియు మరియొకక్రియాధీన
మగుచువచ్చుపోవుటంతె కాని
రాకపోక లెరుగరాదు బ్రహ్మాదుల
కైన నాదుముద్దులయ్యవినగ.

వ. కావున నీపెను మాయ అదృశ్యంబగు కాలంబున గ్రహ రోగ, సర్ప, వృశ్చిక, వ్యాఘ్ర, కూప, తటాక, మహిజాతుల యందు నెపంబుండుటయేలాగో ఆక్రమంబుననె జననీ జనకుల నెపంబున పరిదృశ్యంబె కాని మరియేమియు లేదనిన శేషమానికి శివరామయోగి యిట్లనియె.

క. కరచరణాద్యవయవముల్
దొరకొని నిక్రమగ మదికిదోచుటయే వో
యొరిగింపు దీనిమూలము
పరిశీలముగాగ మానిపతి రాట్తిలకా.

వ. అనియడిగిన శివరామయోగికి శేషమానీంద్రుండిట్లనియె

గీ. మరుపుమరణంబు నిద్రసమాధిమూర్ఛ
లాదియైనట్టి నీయైదవస్థలందు
లేదుగావున నీ వస్మరాదుదాని
రూపమఖిలప్రపంచంబు రూఢిగాను.

వ. కావున మాతాపితృలను భ్రమణంబు మాయాకల్పితంబైన బంధంబెకాని మరేమియుంగాదు.

## యోనిబంధం బెట్లనిన-

వ. తల్లిదండ్రులులేకనే యుత్పత్తియగుటంజేసి.

ఉ. కావునయోనిజన్ముడవుగావు నిజస్థితి గానలేక
దుర్భావమునన్ జడత్వమగు బంధములన్ దగజిక్కి వేలవై
జీవుడనంచు నీవిటుల చింతిలుటేల నిజాత్మదృష్టిలో
కేవలయోగీశ్వరాకృతిని కీల్గని యొప్పుదువయ్య శిష్యుడా.

వ. కావుననీవు నయోని సంభవుండవుగాని యోనిసంభవుండవుగావు. అనిన శేషమానీంద్రునకు శివరామయోగియిట్లనియె.

క. యోనిద్వారంబుననే
మానవజన్మంబటంచు మరిశాస్త్రములన్
గానంబడుచున్నదిదెగా
దీనదయా నిజముకల్ల దెలుపవె నాకున్.

వ. అనిన శివరామయోగి శేషమానీంద్రునకిట్లనియె.

గీ. అరయసంయోగ సమయంబునందుదలచి
సవ్వడెల్లను నొకశిశువవతరించ
లేదుగావున నిజమనరాదునిద్ర.
వచ్చినపుడెల్ల నొకకల వచ్చినదియె.

వ. అదియునుంగాక.

గీ. స్వప్నకల్పిత యేక్రియజరుగునెచట
నుండియేతెంచె దృశ్యమానునరబోళ్ళు
కెచటకదియోనిసంభవ మాయయోని
సంభవమెందాని మూలాగ్రసరశివెలుపు.

వ అనిన శేషమానికి శివరామయోగి యిట్లనియె.

క. మూలములేకనె స్వప్నము
చాలగబరిదృశ్యమగుచుసర్వంబుదగం
దేలుచు మునుగుచు నంతలా
నేలోకముకేగునదియ నెరుగుటతరమే.

వ. కావున స్వప్నంబు యోనిసంభవమని వచించుట న
త్యంబుకాటిల్లుగావున అయోనిసంభవమే మహాత్మయనిన శివరామ
యోగికి శేషమానీంద్రుండిట్లనియె.

క. అదియిదియొకటేయని
నీమదిదలచి యఖండమైన మార్గమ్మునగని
హృత్పదనమున గురునిపదములు
వదలక సేవించ వదలుబంధమువత్సా.

వ. ఇదియునుంగాక -

క. దృక్కులకగోచరము గుణం
బెక్కువ నదు గర్భమునను బెరిగిన తనువీ
దిక్కున గానక యోనికి
గ్రక్కున జన్మించినదియు గాదుదలంపన్.

వ. కావున నట్టింట బుట్టినవాడు వాకిటికి రాగానే వాకిట బుట్టినవాడా కనుక నీవయోనిసంభవుండవో యి శిష్య యింకను పంచభూతంబులలో గూడియున్నావనియెడు భ్రమణంబు షోడశాక్షరియను మహామంత్రంబున కాహుతిగా నొసంగెద వినుమని యిట్లనియె.

## పంచభూత బంధంబు జెప్పెద.

సీ. అస్థిమాంసము చర్మ మారోమ నాడులు
నాదియా నీవైదు నవని పాలు
మలమూత్ర స్వేదముల్ మరి రక్తశుక్లమా
తలపగా నుదక భూతంబు పాలు
ఆకలి మైథునం బాలస్యమాదప్పి
నిద్ర యగ్నికి జెల్లు నిజము గాను
పరుగుట ముడుచుట పరగ నడచుట నిలచు
టాది ప్రాణము మారుతమునకు జెల్లు
ఆశ భయములు లజ్జ యా శిగ్గు మోహంబు
శబ్దమాకసమునకు జెల్లబోవు

గీ. గానమిగిలిన దేదానిక్రమముగనదియె
సర్వపరిపూర్ణభావమై సత్యమగుచు
వెలయునిర్మైల్యము దానికి వేరులేదు
షోడశాక్షరి యర్థమిచ్చోటతెలియు.

వ. కావునమూలములేకగుర్తెరిగే శరీరము ఏమిలేదనినద్గురువాక్యంబునసత్యంబుగా దలంచి నూచినయీపంచభూతంబులు నిన్నంటనేలేదు గావున నికనీకు అయిదవబంధంబెరింగించెద

## పునర్జన్మబంధము.

వ. అదియెట్లనిన పునర్జన్మంబు నొందెదననియెడి భ్రమణంబునకు శేషంబులేదుగనుక నీకుపునర్జన్మంబులేదు. మాయాకల్పితంబైన బంధంబె కాని మరియేమియులేదు. ఇకను సర్వపరిపూర్ణంబయిన ద్వాదశాక్షరి యను మహామంత్రంబున కన్యంబు లేదు ఇద్దియెదనిన నిట్లనియె.

సీ. అదిసర్వపరిపూర్ణ మదినిర్వికారంబు,
నదియెనిరాలంబ మదియెనిజము
నదియెనఖండంబు నదియెనిర్వచనీయ,
మదియెయఖండంబు నదియెనిజము
మదియె నిర్ద్వంద్వంబు నదియెనత్యజ్ఞాన
మదియెమహత్తత్వ మదియెనిజము
అదియె నిశ్శబ్దంబు అదియెనిరామయ
మదియెనిరంజనంబదియెనిజము,

గీ. అదియొకేవల మద్వైత మమలమాది
యగుచు బ్రళయంబునందైన హతముగాక
నొక రీతిగ అచలమై యున్న బయలు
నదియునీవని తలపోయు మమలచరిత.

సీ. అబ్ధిలో మునగదు నవనియందణగదు
దావాగ్నిశిఖలచే దగులబడదు
ప్రళయానిలాహతి బడదు శస్త్రంబుల,
గూలదు రాళ్ళచే గొట్టబడదు
పాశంబులనుపట్టు బడదు శస్త్రంబున
నుబ్బదు వానకు నూడిపోదు
వడగండ్లగట్టిట్టు వణకదుయెండను,
యెండదు చలికితా బెండువడదు

గీ. గానయిదినిర్వికారమై కదలకెల్ల
కాలమొకరీతియచలంబు గానువించు
పుట్టిగిట్టుటలేకను చట్టువలెను
అదియు నీవయ్య శివరామ యఖిలరామ.

క. పుట్టదు గిట్టదు యొరులం
గొట్టదు మరి భక్తిగలిగి గొనియాడిన తా
బెట్టదు యించుకయైనం
దిట్టదు కోపంబుచేత దిట్టిననైనన్.

క. ఆడదు పాడదు మొఱలం
వేడదు మురిభక్తిగలిగి వేడ్కఁ దొనైనం
జూడదు రొమొయని జత
గూడదుయుప్పొంగి మిగుల కోరికతో షణ॥

క. ఆదరదు భయమును గొని తా
బెదరదు సత్స్వాహామునను పిలువదు మదిలో
వదరదు నట్టిట్టని తా
కదలదు పెనుచట్టుభాతి గా శివరామా.

క. అరుగదు విరుగదు రేమియు
నెదుగదు యిందివింతలనుచు యన్నాళ్ళకు తా
యరుగదు త గదు అగ్నికి
కరుగదు నీరంబుభాతి గా శివరామా.

వ. అని పంచబంధవిముక్తుని గా నొనరించి శేషహానీంద్రుండు
శివరామదాగికిట్లనియె॥

సీ. పూర్వజన్మము నీకు పుట్టుపోలికె లేదు,
మళ్ళిజన్మకురావు మహినియందు
తల్లిదండ్రులు లేరు తర్కించిచూడంగ,
దానిసంభవమును యోనికి లేదు
నాదుకరుణయు లేక నఖిలశాస్త్రంబులు,
చదివిచూచితివయ్య సంతిగనక

యుండుకుమీకింక నితరశాస్త్రంబుల,
పొందుజూడక నీవు జెందుబయలు

ఆ.వె. యనుచు గురుడు దెల్ప విని శిష్యరూగణంబు
పంచభూతఘటము పెంచులయ్యె
లోకభౌతికముల లోజేరినవిహారి
శిష్యభ్రమలుదీరి స్థిరముగానుండె.

క. గురుభక్తిగలిగియే స
త్పురుషుండీ పంచబంధముల క్రమమెల్లం
మరుపక చదివిన శ్రీ స
ద్గురుడొసంగును ఖండపదవి కోరికలరయన్.

ఓం.

## శ్రీమద్గురుపరబ్రహ్మణేనమః.

## శ్రీఅచలగురు శంకరాచార్యగురవేనమః.

## శంకరాభరణమురాగము.

(1) నిన్నేనమ్మితిగురు- నాథశంకరమూర్తి- నన్నుగావుటకీర్తి- యెన్నివిధములనైన- సన్నుతించితిగాని - మిన్నకుండుటేమి॥ స్వామి॥ నిన్నే॥ యురగభూషణభక్త- వరునిప్రార్థనవిని-పరములొసగవేమి- పరమపూరుషనన్ను - వరునిగజూచుట - పంతములదేవా- .బ్రోవ॥ నిన్నే॥ మాయరహితుడనన్ను- వేయువిధము

లనేను- వేడుచుంటిస్వామీ- కాయమస్థిరమయ్యె- కలకాలమువేడ- ప్రియమెంతయూలేదే- పోదే॥ నిన్నే॥ భక్తియుక్తియుగాని- ముక్తిదాయకుడాని- మరయుచుంటిదేవా- రక్తిగానినువేడే రసికాగ్రగణ్యులెపుడు- శక్తిరహితమై- శాశ్వతపదమంటిరే- గంటిరే॥ నన్నే॥ పరులనిందలుబాపి- పరిపూర్ణమునుజూపె- పతితపావనుడనువాని- వరదా సూర్యకాంతం- మరిమారివేడిన- మరచియుండుటేల- వీలా॥ నిన్నే॥

## కాంబోజిరాగము.

(2) గురునిమినావేరొకదైవము-మరిలేదునినవే- ఓమనసా సరగునసద్గురుని మరువకదలచితే-వరమునొసందేవేనీ॥ వోమనసా॥ యీషణ త్రయములు కానుకోనున్నవి మోనముజేసునె వోమనసా కోశములపైవెల్గె యీశునినమ్మితే మోనము నొందవువో మనసా ॥గురు॥ గొప్పవాడననియెప్పుడుబలక్రకుమువ్వనుజెందేవు ఓమనసా- తప్పక సోహమునుయెప్పుడుతలచితేముప్పనుజెందావు ఓమనసా॥ గురు॥ యిలలోను నావంటి బలవంతు లెవరనుచు పలుకుచు నుండకే- ఓమనసా- కలలోశరీరములేలాగునుండునీ వాలాగుగోలియవే- వోమనసా॥ గురు॥ చుట్టాలు నెచ్చెలుల చూచుకొనినీవుమిట్టిపడుచునుండకు-ఓమనసా- దిట్టముగయముడు కట్టియీడ్చుకపోతెచుట్టాలురారెవరు-ఓమనసా-యేమిలేనిబయలై స్వామిశంకరుడుండె కామాదులనుబావు- ఓమనసా- ప్రేమతో సూర్యనారాయణుని బ్రోచినసామినినమ్మమి- ఓమనసా॥ గురు॥

## కాంభోజిరాగము.

(3) తనువునిత్యమా- మనసా॥ తను॥ అనృత మాడుటకు వెనుకదీయవైతివి॥ తను॥ ఘనులవిడచియా- ఘనులతోటికూడి- అనుదినమున పనిబాటలు- ఘనముగ జేసినీ॥ తను॥ నిత్య సత్యవ్రత మనే- సత్యవాక్కు- నెరుగలేక- అత్యంతము హీనుల వాక్యము- సత్యమనుచు జనుల నమ్ముట॥ తను॥ సాధువైన శంకర గురుపాద మందలేక భువిని- వాదాభేదము నొందుచు- నాదినీది యనుచునుడి వెదవు॥ తను॥ ఆర్యులెన్నైబోధవిడచి- శౌర్యమైన పనులజేసె ధై ర్యత్వమునకువరదా- సూర్యనారాయణయని మొరిగెవు॥ తను॥

## శహానరాగము.

(4) గురుని విడనాడకే మనసా॥ గురు॥ హరిహరాదులకు నెల్ల- వరుడై వెలసినస్థిరముగ॥ గురు॥ కర్మరహిత మునను గాంచి కామక్రోధములనుద్రుంచి- నిర్మలుడై నిజపదమున- నిండియున్న వాడు॥ గురు॥ రాగద్వేషములను బోక- రాకపోక మెరుగలేక- ప్రాకటముగ సర్వంబును- ప్రబలుచునుండేటివాడు॥ గురు॥ ఆగామిసంచితముల- యంటకుండ దుంచివేశి- రోగుల హృదయ గ్రంథిని- యందునుండకుండ జేసిన॥ గురు॥ సూర్యనారాయణను బ్రోచి- సూరిజనుల మెచ్చజేసి- ధర్మాధర్మములనురోసి- ధరను శంకరుండైవెలసెను॥ గురు॥

## శహానరాగము.

(5) గురునాథ బాపుమింక- మెరుక మరవుశంక॥ గురు॥ పరిపరివిధ మేవంక- పరువిడకుండనింక॥ గురు॥ బంధమోక్షముల

నింక- బాపెదవని నీవంక- జెందియుంటి నేనింక- జాగు సేయకుడింక॥ గురు॥ లేని మాయయందు- లేక నేవచ్చితిందు- ననయము నీపొందు- నంటియున్నానిందు॥ గురు॥ యుపాధిద్వయము లేని- యుచిత వాక్యమువిని- కృపకటాక్షుడవని- కోరియుంటి పూని॥ గురు॥ పుట్టుగిట్టుటలద్రుంచె- పుణ్యుడవని యెంచె- పట్టియుంటినను గాంచె పరమపదమునందుంచె॥ గురు॥ ధర సూర్యదాసపోష- పరమపురుష యీశ- పరశంకర గుర్వీశ॥ మరిమరి వేడితి పరమేశా గురు॥

## సావేరి రాగము.

(6) తారకయోగము తెలియుట యున్నది తత్వవేత్తలకు నిజమయ్యా॥ పూరికై దిరుగక సద్గురువాక్యము- వంచన లేకను వినరయ్యా॥ తార॥ అండపిండబ్రహ్మాండము వెలిలో- కుండలిమధ్యను గనరయ్యా ఖండఖండములు గాకయెప్పుడును కర్మరహితమై వెలుగునయ్యా॥ తార॥ ఆరుచక్రముల అటు యిటు దిరుగుచు- మీరి సుషుమ్నను గనరయ్యా వేరుగాక యయమాత్మ బ్రహ్మమై- యార్యుల వాక్యస నలరెనయ్యా॥ తార॥ ఆత్మ వేరు పరమాత్మ వేరని- యనుటగాదు మరి వినరయ్యా- ఆత్మానాత్మలు రెండు తెలసియు అహంబ్రహ్మమనుచుండరయ్యా॥ తార॥ వేయుదళముల కిరువైసర్వము, వెల్గుచునున్నది చూడరయా బాలకశంకరు గురువాక్యంతట భవముల ద్రుంచేవరమయ్యా॥ తార॥ గురుపాదంబును గురుతు గలిగిన గుణరాహిత్యుల గాంచరయ్యా- ధరణిలో వరదా సూర్యనారాయణ తరచిచూచుచుండిన దేనయ్యా॥ తార॥

## శహానారాగము.

(7) హంసను దెలియవలెరా- జీవా॥ హంసను దెలియవలెరా హంసను దెలియు సంసారము రోసే- హింసలు జెందని- కంసారనియే వర॥ హం॥ సుషుమ్నాంతమున సూక్ష్మము తానై- విసరుచు పుటముల వశమై యుండె- వర॥ హం॥ పంచరంగులలో మించి ప్రణవమై సంచితంబులను ద్రుంచివేసె- వర॥ హంస॥ మేటిసహస్రమున నాటి శబ్దముల- కూటమందు గురు సూటియైన వర॥ హం॥ ఆరుమెట్ల పై కోరి నిలుచుచు మీరి సోహమని దారి జూపె వర॥ హంస॥ ఆర్యులకెల్లను మేరువా శంకరా-చార్యుల పాదము జేరియున్న వర॥ హంస॥ గురుకటాక్షమున సూర్యనారాయణ- మరుగు దెలసితా వరమై యున్న వర॥ హంస॥

## సురటరాగము.

(8) గురునకు మ్రొక్క రేమి- నరులార మీ॥ గురు॥ గురునకు మ్రొక్కిన సరగున మీకిపుడు - విరుగు తరుగులు లేని- పరిపూర్ణమును జూపు॥ గురు॥ బోధ నేమియు గాదు- నరులార మీ- సాధనేమియు లేదు- ఆదియనాది యనేది నెరుగకుండ- సాధనరహితమై సమరాసమై యున్న॥ గురు॥ పండ వెన్నెల గాదు- నరులార మీ- దండిచీకటి లేదు యెండమావుల వలె- నుండిన ప్రపంచ- ముండిన పోయిన- రెండు గుర్తెరుగని॥ గురు॥ దేవపూజలు గాదు- నరులార మీ భావమెన్నడు లేదు- దేవదేవ మమ్ము బ్రోవు మనిన గాని- భావమెన్నడు లేక బట్టబయలై యున్న॥ గురు॥ శోడశాక్షరి భావము

నరులారమన- మేడజూచిన గానము- ఆడయూడన మండ యేడేడు లోకములు- నిండే ద్వాదశాక్షరేడేడజూచిన॥ గురు॥ అరుగుకరు గులుగాకను- నరులారమీ- హారుగుమారుగులులేకను- ధరలోశం కరగురుని- మరుగుదెలిసినపుడే- వరదా సూర్యనారాయణ వర మాపదమైవెలసె॥ గురు॥

## శంకరాభరణరాగము.

(9) గురుబోధవినండి- పరమపురుషులార॥ గురు॥ పరిపా రివిధముల వరుపులు బారక॥ గురు॥ భక్తిమార్గము కాదు - ముక్తి జెందుటలేదు - శక్తిరహితమయిన - శాశ్వతపదమనె॥ గురు ॥

సాధనేమియులేదు భేద భావము గాదు . ఆదియంతములేని- యచలమై వెలిగేటి॥ గురు॥ మండలిశక్తిగాక దండిమారువులులేక- అండపిండాదుల నిండియున్న వెలుగు॥ గురు॥ హరిహరాదులుగాక- ఆయావదవులులేక-మరపు తెరవునుగాక పరమపదమనిబర గు॥ గురు॥ మూడునాల్గునుగాక మూడవస్తులులేక- యేడజూచినబయలు వేదు కైయున్నది॥ గురు॥ ఎందరులేదనిన యెందుజూచినగాని నందునవ లయందు పొందియున్నదినిజము॥ గురు॥ పదియారక్షరములు పరి కించుటెరుకయ్యె- పదిరెండక్షరములు పరిపూర్ణమైప్రబలె॥ గురు॥ ధరనుశంకరగురుని వరవాక్యమువిని పరమార్థమనిదెల్పె- వరదా సూర్యనారాయణ॥ గురు॥

## సురటరాగము.

10 జయలోకనమని నమ్మబోకుడీ సద్గురునాజ్ఞ ద్వయము లేకున్న తెలియుడీ- రయమున గురుని జేరి- ద్వయము లేని బోధ- నయముగా దా పొందిన - భయములన్ని యుతీరు॥ జయ॥ శత్రుమిత్రుల నెరుగాక సద్గురునాజ్ఞ వృత్తిబయలై మెరయగా - శత్రుల నరికిన తత్త్వార జెందకుండ- చిత్తముకు దారకక మిత్రమై యున్న దేవుడు॥ జయ॥ వ్యాపకములబొందదూ- సద్గురునాజ్ఞ- పాపములను జెందదూ- రూప నామము లేక రూఢిగ వెలుగుచు - నాపదసంపద ననిశాము నెరుగకుండ॥ జయ॥ కామక్రోధములొందదూ సద్గురునాజ్ఞ ప్రేమాదులను జెందదూ- నీమముతో జనుల - నఖిలభక్తిజ్ఞాన ప్రేమతో జేసిన యేమానకున్న దెవుడు॥ జయ॥ ఆకాలిధప్పినెరుగాక- సద్గురునాజ్ఞ యే కాలమున గదులాక లోకత్రయము తనలో- నేకమై దిరిగియున్న చేకానకుండక నేకమైయున్నదదుగో॥ జయ॥ కోపములను బొందదూ- సద్గురునాజ్ఞ తాపములను జెందదు- దీపముపలె కనుపావలో మెరుకను రూపమెట్టిదో తేలక రూఢిగ నిలచియున్నది॥ జయ॥ రాకపోకలు లేకను సద్గురునాజ్ఞ యేకమై ప్రబలగానూ - లోకలోకము వారు చీకాకైన గాని బోకతోడుత వారి - బోలెరుగకున్న దేమో॥ జయ॥ కార్యకారణము లేకా సద్గురునాజ్ఞ స్థైర్యస్థైర్యములు గాకా- ఆర్యశంకర గురుని యందు తెలసినవుడె- సూర్యనారాయణ చూచుచున్నది నిజము॥ జయ॥

## సావేరిరాగము.

11 నమ్మబోకుండి నమ్మబోకండి- యీ యెరుక నెపుడు॥ నమ్మ॥
నమ్మబోకుడి నమ్మబోకుడి నమ్మతమును యెరిగిమరచు సుమ్మదీన్ని
గుణములింతే- బొమ్మలాటగ దెలసిమీరు॥ నమ్మ॥ పంచభూతాముల
ను దెల్పూచు- యీ యెరుక యెపుడు- పంచి యిరువాదైదునానుచూ-
పంచియిరువదైదునను మించిప్రణవానాదమూని- యెంచిచూచిని
లకతనలో సంచితములుజిక్కినవైను॥ నమ్మ॥ అహంభావమూంసని
ల్చియు- యీ యెరుకనెపునసోహంసోహమూనిబలిక్కయు- సోహం
సోహమూనబల్కి మోహమూన జెందియుండిదోహములు లేనట్టిబయ
లన- ఆహా యేమియు లేకపోయెను॥ నమ్మ॥ అంచితముగారంగులగ్ర
మును- యీ యెరుక యెపుడు యెంచిహృదయస్థానమూనెనూ- యెంచి
హృదయస్థానమూన మించిఆపోద్యోతినిలిపి- మంచికళనుజూచుచును
తా- కొంచెమైపోవుచున్నది॥ నమ్మ॥ ప్రకృతిపురుషులైవెలయునూ-
యీ యెరుక యెపుడు- సుకృతమూలు దెల్పుచుండునూ- సుకృతమూ
లుబలుక్కదీని వికృతమూలుజూచియార్యులు - నేకృతములు జేయు
కుండే ప్రకృతిపురుషులుదోచకుండెను॥ నమ్మ॥ అండపిండాముల
కుపైగాను- యీ యెరుక యెపుడు- కుండలీశక్తిదెల్పునూ- కుండలీ
శక్తిననిబ్రహ్మాండమంతట- నిండివెలుగుచు- దండియైన యచలబో
ధను- యెండమావులట్లుదోచె॥ నమ్మ॥ ఆదియంతము లన్నిదెలియూ
ను- యీ యెరుక యెపుడు- గాధలెన్నియొబలుక్కచుండియూ- గాధ
లెన్నియొబలిక్కయితర- భేదమూనపెద్దలాతో వాదమూలు జేసిగు
రుని- బోధయందేనిలువకున్నది॥ నమ్మ॥ పరమపురుషుల పలుక్క

లందునా- యీయొరుకయెపుడు- పరిపరివిధములబొందునా- పరిప
రివిధములబొందక- వరదసూర్యనారాయణ- ధరనుశంకరగురు
నిహితము- మరుగుజేరిన దెపుడులేదు॥ నన్ను॥

## శంకరాభరణరాగము.

12 ఎన్నటికినన్నురాదురా- యీయొరుకునెపుడు- సున్న
గానేచూడవేమిరా॥ ఎన్నటికినన్నురాదు ఎన్నివిధములైనగాని-
కన్నెలుపురుషులైనకలా- కర్మములునిండించిపోను॥ ఎన్న॥ దేవ
తాంతిగలిగియుండురా- యీయొరుకయెపుడు- బోధకరేయని పలు
కుచుండురా- దేవభ్రాంతిగలిగియుండి కేవలాము కేశవాదుల- తో
వగానకతిరిగితిరిగి- యేవిధమునజిక్కియున్నదో॥ ఎన్న॥ కలలో
దేహములల్లెరా- యీయొరుకయెపుడు- ఫలముగానబరగుచుండురా
కలలోదేహములల్లె- తలచాకనన్నర్గనరకము- కలదంచుతననెతా
ను- గునగొంటులేకపోయెను॥ ఎన్న॥ పరులునేననిభావమందిరా-
యీయొరుకయెపుడు- కరుకువాదామాడుచుండురా- పరులునేనని
భావమంది పరిబరివిధములదిరిగి- ధరనుసంసారమునదగిలి- దారు
పురుషునిచందమాయె॥ ఎన్న॥ సకలధర్మాధర్మముజూచురా-యీ
యొరుకయెపుడు- వికలముగానబొందియుండురా- సకలధర్మాధర్మ
ముజూచి- సర్వసాక్షిననుచుదెలసి- యకలంకమైతినని- యాకా
శపుష్పమునబోలె॥ ఎన్న॥ బట్టబయలు నొందలేకరా- యీయొరు
కయెపుడు- మొట్టమొదటనె లేకయుండెరా- బట్టబయలునొందలేక
పుట్టుగిట్టుటలనుబొంది- అట్టెజూచిన పంఛాన్యపుత్రిని - గుట్టుమై

యున్నాదిగనుము॥ఎన్న॥ ధరను శంకర గురుని జేర రా- యీ యెరు
కయెపుడు- మరియు చుతామన్నా రాదు రా- ధరను శంకర గురుని జేరి
వరద సూర్యనారాయణ పరమపదము నందిన పుడే- మరిమరిచక
మా ౯ నెరుక॥ఎన్న॥

## శహానా రాగము.

(13) నిండియున్నది చూడ లేరైరి- పరిపూర్ణమంతట॥నిండి॥
నిండియున్నది చూడలేక - యండమూర్తులట్టుదోచు- కొండగోపుర
ములవద్ద- గూడితపసులు జేసుకేల॥నిండి॥ దండిభావము గంటికుం
చుసు॰- పరిపూర్ణమెరుగక- పందు వెన్నెల బయలటించునూ- దం
డిభావముగంటికుంచు - మొండుగా గెడ్డములు బెంచి - యొండ వానల
నకదిరిగి- గుండకాయ్యలవు టెగాని॥ నిండి॥ ధ్యానదానములనున
ల్పచూ- పరిపూర్ణమెరుగక- ప్రాణహానములను దెల్పుచూ- ధ్యాన
దానములనుసల్పి- యోనిసంభవముంచు దెలియక- నేను తానై బ్రహ
మనుచూ- పూనివాక్యము బలుకు- టేల॥నిండి॥ షడచకాత్రము దెల్పు
చూ- పరిపూర్ణమెరుగక- యాడయాడను నిల్పిచూపుచూ- షడచ
కాత్రములనునిల్పి- యీడపింగళనాడులందున- వేదుకాతోదిరు
గుహానను- గూడిబట్టిన బ్రతుకగలదని॥ నిండి॥ యక్షరాజవిధము
దెలియరూ - పరిపూర్ణమెరుగక- మోక్షపదవులు గోరుచుందురూ-
యక్షరాజవిధము దెలియక - సాక్షినీవని యహాను దెల్పు - టాక్షే
త్రక్షేత్రములనుయెరుకని - సిక్షమాత్రము దెలియలేక ॥ నిండి॥
సూలమూ లేదని తెలియరూ- పరిపూర్ణమెరుగక- కాలమూను గడు

పుచుండేరూ- మూలము లేదని తెలిసిన - యీలయీగురుత్రిగితను పు-
చాలుచాలు నయేమిలేదని- వీలుగా గురువాక్యమెరుగక॥ నిండి॥
కాయశుద్ధియె నిక్క మంచనూ - పరిపూర్ణమెరుగక - ప్రియ
మెంతయు దెలియకుంచునా- కాయసిద్ధియె నిక్కమంచు- వేయు
విధములకాంగ సాధన- జేయుచుండిన మితము దెలియక - మాయపై
పొయ్యేటితనవై॥ నిండి॥ భ్రాంతిరహితమె మోక్షమన లేరు- పరి
పూర్ణమెరుగక- కంతుజనకుని గొలచియుండేరూ - భ్రాంతిరహిత
మె మోక్షమని- కాసింతశంకరు గురుని వాక్యము - సంతతాము జూ
చువారికి చక్కగ పరిపూర్ణమయ్యె॥ నిండి॥ పొందబోరు పరమపద
మూనూ- పరిపూర్ణమెరుగక- నందియమునూ దీరకుండున-పొంద
బోరుపరమపదము- యెంతజూచిన సందులేనిదె- అందియున్న సూ
ర్యకాంతము- సందియములు దీరినపుడె॥ నిండి॥

## ఆనందభైరవిరాగము.

(14) పంచదశాక్షరి నంటిచూడరా- ప్రపంచమంత- గాం
చుటకు స్వప్నమాయెరా- పంచదశాక్షరినంటిచూడక - సంచితము
నుజిక్కెనను చు- గాంచనేరక భ్రమలజిక్కి - గలదంచును- ఫల
మంచును- యిలనంచును- విలపించెవు॥ పంచ॥ పుత్రభ్రమనుబొం
దబోకురా- ప్రపంచమంత - చిత్రచిత్రములను సుండెరా - పుత్ర
భ్రమనుబొందియుండి- సత్తుచిత్తని రెంటివేర్వరు - చిత్తవిభ్రమల
చేతజిక్కి- జీవుండని- దేవుండని-గావుండని- భావించుట॥పంచ॥

రాజయోగము నూటిదెలియరా- ప్రపంచమంత- గాజుకడియము
లయ్యెచూడరా - రాజయోగము నూటిదెలియక - రాత్రిపగలు
నిష్టజెందియు- నజూడెనర్వమయుడటంచు- నాదబ్బని- ఖేదంబున-
వాదంబున- గాదంబడక॥ పంచ॥ యీవృత్తబట్టబయలుగాంచరా-
ప్రపంచమంత- రవినిగాంచినచీకటాయెరా- యీవృత్తబట్టబయలు
గాంచక- ఈశ్వరత్వమందెననుచు- కోవిదులనుగాంచినపుడె-ఖం
బ్రహ్మని- హంబ్రహ్మాస్మీ- త్వంబ్రహ్మని- సర్వంబ్రహ్మనుట॥పంచ॥
ధరను శంకరగురునిజూడరా ప్రపంచమంతదారు పురుషుని చం
దమాయెరా- ధరనుశంకర గురునిజేరక-దైవమాననుగాభ్రమనుచు
పరిపరి విధములవేడియు- పతితుండనుగతినీవని సతతంబున క్షితి
వేడుట॥ పంచ॥ పరనూర్యకాంతము బాటజూడరా- ప్రపంచ
మంత మరిమరీ చకముగ మీటెరా- పరనూర్యకాంత మబాట
జూడక వెరపుచేత హరిహరులను- పరము లోనగిబ్రోవుమనుచు
వందనమిది- పొందుమనది- యెందునగతి- గందనసుట॥ పంచ॥

## శహానారాగము.

(15) నిత్యకృత్యాదులనుగావు- నిజమునిటకడ దెలియరా-
సత్యశాస్త్ర- సర్వజగములు- సంతతమునిండుండెరా॥ నిత్య॥ కామ
క్రోధాదులనుమించి- కర్మములుదెగనాడెరా- యేమిలేనిదియేమినా
నిది- యేమిటోగనియుండరా॥ నిత్య॥ జననమరణము నుంతకెవ్వ
డు- జగతికెలిలోనుండెరా- ఘనమనీచయంతెన్నవారికి- గానరా

తున్నాదిరా॥ నిత్య॥ వరులు నేననై భావమందె- వలు తునను గనరా దురా- వరదుడౌశివ రామదీక్షిత వాంఛయిదిగనియుండరా॥ నిత్య॥ రజ్జుసర్పభ్రాంతివలెనని- సుజ్జగంబులుగాదుగా- యర్జునాదులువేడినప్పుడు- యాదికృష్ణునిబోధరా॥ నిత్య॥ భవముతానని గుందుటకును- బంధమోక్షముగాదురా- నవినయంబుగ కృష్ణదాసుని- సత్యవాక్యము నమ్మరా॥ నిత్య॥ ధర్మకర్మవ్వందమౌరుగని - ధరనుశంకరబోధరా - నిర్మలంబై సూర్యకాంతము - నిత్యపదవిని బొందెరా॥ నిత్య॥

## సారంగరాగము.

(16) బట్టబయలు గనుగోనండి - సత్పురుషులారా - బట్టబయలుగనుగోనండి॥ బట్టబయలుగనుగోనుటకు- గుట్టుమైన మెరుకమూలము - మొట్టమొదటకుద్భవించి వేసే- దిట్టమైనా గురునివాక్కుచే॥ బట్ట॥ పట్టిమాటలుగావువీనండి- సత్పురుషులారా- పట్టువిడువులు లేకనిలుచుండి- పట్టిమాటలుగాపుభ్రమల- బెట్టకను సర్వంబుతానై- చట్టవలెను గదలకుండగ- చక్రగా నిలుచున్నదంతట॥ బట్ట॥ మెరుకమరుపులు లేకచూడండి- సత్పురుషులారా - మరుగుయేమియు లేదుకూడండి- మెరుకమరుపులు లేకసర్వా- దురితములనె దవాపిత్తూర్ణల- వరకువదమై వెలసియున్నది- పతితులకుగనరాని దెప్పుడు॥ బట్ట॥ కులముగోత్రము భ్రాంతివీడండి- సత్పురుషులారా-

స్థలముఫలమును గోరబోకండి- కులముగోత్రము వీడినద్గురు- నెల వునందుననిలిచియున్నాను- కలుషములు దెగవాడిస్థిరమై- కంటిముం దరనిలచియున్నది॥ బట్టు॥ పరతత్వపదముబొందండి- సత్పురుషు లారా - తరతరాభావములు వీడండి - పరతత్వపదముబొందిన- ఘోరసంసారాబ్ధిజలధియు- వారినికలలో గాంచిమగ్గిన-కరియు కరణిగవీడిపోవును॥ బట్టు॥ వేదశాస్త్రము గాదుచూడండి - సత్పురు షులారా - బాధలన్నియు తొలగిపోనండి - వేదశాస్త్రముగాదు పె ద్ద- గాధలోబడియుండబోక - మోదములరగ శంకరార్యుని - పాదమందుమనసునిలిపి॥బట్టు॥ జనన మరణము లేదుచూడండి సత్పు రుషులారా-ఘనము నీచములెన్నబోకండి- జననమరణము లేకన నయము జగతిలోలోపూర్ణమైనది - వినయముగను సూర్యశాం తము మనవిజేసినమాటనమ్ము॥ బట్టు॥

(17) కన్నది విన్నది యున్నదిలేకయున్నదిపరిపూర్ణంబదే కదా- చిన్నెల మాయైచిత్రకళలుతా- కన్నులజూపినదిదేకదా ॥కన్న॥ దారాపుత్రధనాదుల జేరని- ధన్యుల బోధించిన దదేకదా- వేరువేరుకాంతులచేతను వారినిజెందిన దిదేకదా॥ కన్న॥ వేష భాషలను వెరవుగనుండక ను వెల్గుచునుండినదదేకదా- దోషములెం చినదాసులజేరియు- మోదముబొందిన దిదేకదా॥ కన్న॥ కుల గోత్రములనే కుటిలమోహములను- కూలద్రోసిన దదేకదా- కల కాలంబున కర్మమునిజమని- కాలముగడిపిన దిదేకదా॥ కన్న॥

సంగతి దెలియని దొంగగురువుల చెంగటనిలువనివదే కదా- అంగ
ములోపల లింగమున్నదని భంగము జెందిన దిదే కదా॥ కన్న॥
తానుతానను తత్వము దెల్పిన తపవునూచె దని దదేకదా- మాను
గ జనులకు మోసంబునాల్గని మోదింబలికినదిదేకదా॥ కన్న॥ పంచ
భూతములయెంచినయెరుకను ద్రుంచివేసినాదదేకదా- సంచితంబు
లను చక్కగ దెంచినియు కీర్తించనుజెందిన దిదేకదా॥ కన్న॥ యెరు
కప్రపంచము వేరువేరని యెరుగకుండిన దిదేకదా- మరపుతెరపు
లను మాయలజిక్కియు వరువిడుచుండిన దిదేకదా॥ కన్న॥ ధర
ణిలో శంకరగురువగు దెల్పిన దైవశిఖామణి యదేకదా- పరదా
సూర్యనారాయణవాక్కున వర్ణనజేసినదిదేకదా॥ కన్న॥

## కీర్తన.

(18) పరమానందమును- బొందేరు- సత్పుణ్యులార పరమా
నందమును జెందేరు॥ పరమానందము నేబయలు గురుకృప గల్గకున్న
హరిహరాదులకైనా- యలవిగాకున్నా దనెదు॥ పర॥ ఆరు మత
ములుగానిదీ - తారకసాక్ష్యంబని - వేరు భావములేనిది - దారి
గాని నిగుకుల జేరి యుపదేశంబును- కోరిపొందిన వారిని జేర
కున్నదిదెలసి ॥పర॥ జడమనే పదమునెరుగదు- సదమలత్వమున
జడమనేపదముకరుగదు- విడివిడిబోధలందక- తడయాక పూర్ణ
బోధ - కడువేగమునబొందిన ఘడియాలో గనుపించిన ॥పర॥
దుర్మదాంధకుల ద్రుంచుటు- నిర్మలత్వమున- కర్మాకర్మముల
మించును- మర్మమేమియు లేని ధర్మమై వెలసియున్నది- నిర్మలత్వ

మున మీరునిలచియుండినజాలు॥ పర॥ అండపిండములై పెరుగునా- అనంతమై బ్రహ్మాండమందున తరగున- దండైన యచలఖాణమున నిండిన పూర్ణబోధకులౌ- డాబాయక నెపుకునుండినచాలుచాలును ॥పర॥ నేనుమీరను పదము లేనిది- సుస్థిరము గాను మేమైన తాను గానిది- మూఢుగ సర్వజనులు- పూనడీ రుచినెరింగిన- కనబడు చున్నదదుగో కనుమరుగింతైన లేక॥ పర॥ ధరలో శంకరాచార్యలు- సంపూర్ణబోధ- పగులకు దెల్పుధీరులు- అరమర లేక గురుని చరణాద్వయము జేరి- పరదా సూర్యనారాయణ స్థిరముగ సూచనిదియని ॥పర॥

క. మంగళము నిరామయునకు
మంగళము నిరంజనునకు మహనీయునకున్
మంగళము యచలవేత్తకు
మంగళమని మదినిదలతు మద్గురుచంద్రా.

సంపూర్ణము.



